# ఆంధ్ర నాట్యం

## ఆస్థాన నర్తనాలు

With Best Compliments From :
[illegible]
Andhra Natyam Trust
Chikkadpally, Hyderabad-500 020.

రచన:

ఆంధ్ర రత్న, భరత కళాప్రపూర్ణ

డాక్టర్ నటరాజ రామకృష్ణ


పేరిణీ ఇంటర్ నేషనల్

అశోక్ నగర్, హైదరాబాదు - 500 020

ప్రచురణ ; జూన్ 1987

ప్రతులు : 2,000



వెల : రూ॥ 5-

విదేశాల వెల : $ 1-

ముఖచిత్రం : శ్రీ కనక సూరిబాబు

ముద్రణ : శ్రీ తిరుమల ప్రింటర్స్, ముషీరాబాదు, హైదరాబాదు-20

ప్రతులకు : విశాలాంధ్ర బుక్ హౌస్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-1

# ఆంధ్ర నాట్యం - ఆస్థాన నర్తనాలు

కలలు నిజమౌతాయా అంటే అవుతాయన్న నమ్మకం నా కీ మధ్యనే కలిగింది. మన ఆధ్యాత్మిక నృత్య కళా రూపాన్ని పునః ప్రతిష్ఠించాలని చాలా కాలంగా కలలుకంటూ వచ్చాను. ఈ విషయమై పట్టువదలకుండా ప్రయత్నాలు చేస్తూ వచ్చాను. చివరకు నా కలలు ఫలించే రోజు వచ్చింది.

మహర్షి మహేశ్ యోగివారిని కలవాలని చాలా కాలంగా అనుకొంటూ వచ్చాను. ఈ మహేశ్ యోగివారి ముఖ్య శిష్యులు, నా మిత్రులు అయిన రామి రెడ్డిగారి చొరవవల్ల 1987, ఏప్రిల్ 26వ తేదీన మహర్షి మహేశ్ యోగి వారిని కలుసుకొని శైవ, వైష్ణవ సంప్రదాయ ఆలయ నృత్యాలగురించి చర్చించే అవకాశం నాకు లభించింది. ఢిల్లీలోని వేదవనంలో నిర్మింపబడబోయే వేదేశ్వరాలయంలో శైవ సంప్రదాయక నృత్య పూజలు పునరుద్ధరింపబడ బోతున్నాయన డంలో సందేహంలేదు.

ఈ యాలయ నృత్య సంప్రదాయాంగురించి శ్రీ మహర్షి మహేశ్ యోగి గారితో చర్చించి నప్పుడు, ఆ సాంప్రదాయక నృత్యాలను కొన్నింటిని వారికి ప్రదర్శించి చూపించాను. నా ప్రదర్శనలను ఆ మహర్షి కాక అక్కడుండిన వేద పండితులతోపాటు ఒక జపనీయుడు కూడా చూశాడు. ఆయన ఒక ప్రసిద్ధ ఎలక్ట్రానిక్ ఇంజనీరు. ఆయన నాతో కొన్ని నాట్యాంశాలను గురించి చర్చించా లన్నాడు. నేను ముందు ఆశ్చర్యపోయాను, "సరే" నన్నాను.

"నేను బౌద్ధ మతస్తుణ్ణి, మీ నృత్య ప్రదర్శనలు చూసి మంత్ర ముగ్ధుణయ్యాను. మా షింటో పూజా విధానాలను, మా బౌద్ధాలయాల్లో ప్రదర్శింపబడే నృత్యాలకు మీరు ప్రదర్శించిన మీ ఆలయ నృత్య విధానాలకు చాలా దగ్గర సంబంధ మున్నట్టు, దీర్ఘంగా ఆలోచిస్తే ఈ రెండూ ఒక్కటేనని నాకు అనిపిస్తూంది. ఇక్కడనుండి ఈ కళలు తూర్పు దేశాలకు ఎలా, ఎప్పుడు ప్రచారమై వెళ్ళాయో పరిశోధించదగిన, ఆసక్తి కరమైన విషయం. మీరు ప్రదర్శించిన కేళికా రీతి భావోద్దీపితమైన కళ. మా జపాను దేశ చక్రవర్తిగారి దర్బారులో ప్రదర్శింపబడే రీతికి మీ ఆరాధనా కేళికా నృత్య రీతికి చాలా సన్నిహిత సంబంధ మున్నట్టు, రెండు ఒక్కటేనేమో అని నాకు అనిపిస్తూంది. అయితే దేశ కాలమాన పరిస్థితులను బట్టి కొన్ని మార్పులు వచ్చి యుండవచ్చును. మా దేశంలో ఈ యాస్థాన నాట్యాచార్యులకు మంత్రి వర్గంలోకూడా స్థానాన్ని కల్పించి, గౌరవిస్తారు" అంటూ ఆయన నాతో అనేక విషయాలు ముచ్చటించాడు

ఆయనతో ఈ విషయాలు ముచ్చటిస్తూంటే నా హృదయం ఆనందంతో పరవశించింది. వేయి సంవత్సరాల క్రితం మన కళ ఎలా ఉండేదో తెలుసుకొన డానికి అవకాశం దొరికింది. ఎవరైనా ఈ విషయమై పరిశోధిస్తే మన ప్రాచీన కళారూపాన్ని మనం మళ్ళా నిర్మించుకో వచ్చునన్న నమ్మకం నాకు కలిగింది.

ఆంధ్రుల నృత్య కళనుగురించి నేను పరిశోధనలు ప్రారంభించి ముప్ఫయి సంవత్సరాలు గడచిపోయాయి.

ఆంధ్రుల రాజకీయ చరిత్ర శాతవాహనులతో ప్రారంభ మౌతుంది. ఆ తర్వాత ఇక్ష్వాకులు, శాలంకాయనులు, బృహత్పలాయనులు, విష్ణు కుండినులు మొదలగువారు ఆంధ్ర దేశాన్ని పరిపాలించారు. అంతకుముందు చరిత్ర లేదనికాదు ఒక క్రమబద్ధమయిన చరిత్ర గూర్చి తెల్పుతున్నాను.

శాతవాహనుల రాజ్య కాలంలోనే బౌద్ధ మతం మన ఆంధ్ర దేశంలో విజృంభించింది. బౌద్ధ స్తూపాలు, ఆరామాలు, విశ్వ విద్యాలయాలు స్థాపించ

బద్ధాయి. దేశ. విదేశాలనుండి విద్యా వేత్తలు, తత్వ వేత్తలు ఆంధ్ర దేశం వచ్చి వీటిని సందర్శించి గ్రంథాలు రచించారు అమరావతి, భట్టిప్రోలు, జగ్గయ్యపేట, ఘంటశాల మొదలైన ప్రదేశా లెన్నో మన ఆంధ్రదేశ చరిత్రలో ముఖ్యమైన బౌద్ధమత కేంద్రాలుగా ఉటంకించ బడ్డాయి. మన మత సిద్ధాంతాలు, మన లలిత కళలు తూర్పు దేశాలలో ఎలా ప్రచారం పొందాయో కొంతవరకు తెలుసుకొన డానికి ఈ చారిత్రక గ్రంథాలవల్ల వీలు కలుగుతున్నది. కాని ఆనాటి మన వివిధ నృత్య. సంగీత కళా సంప్రదాయలగురించి, ముఖ్యంగా ఆరాధనా నృత్య కళ గురించి తెలుసుకొనే అవకాశం లేకుండా పోయింది. వేయి సంవత్సరాల క్రితం నాటి మన నృత్య కళా రీతి పూర్తిగా మరుగున పడిపోయింది, కాల గర్భంలో కలిసిపోయింది దీనిని వెలికి తీయడానికి నే నెంతో ప్రయత్నిస్తూ వచ్చాను.

కాకతీయులనాటికి విశిష్ట ప్రచారంలో నుండిన నృత్య సంపదను గురించి జాయప సేనాని తన నృత్త రత్నావళిలో భద్రపరిచాడు. కాని అంతకు ముందుండిన కొంతమంది నృత్య కళా వేత్తలగురించి, నర్తకీమణులగురించి నామ మాత్రంగా మనకు తెలియవస్తున్నదే కాని పూర్తి వివరాలు తెలియరావడం లేదు. ఆ చరిత్రంతా అనేక మతపరమైన యుద్ధాలలో నాశనమైంది. అయినా అక్కడక్కడ కొన్ని శిథిల నృత్య శిల్పాలు లేకపోలేదు. వీటినైనా మనం కాపాడుకొన గలిస్తే ముమ్ముందు మనకు మరికొన్ని ఆధారాలు లభించవచ్చును.

జపాను మొదలుకొని, బలిద్వీపంవరకు ఎక్కడెక్కడ బౌద్ధ మతం పూర్వం వ్యాపించిందో ఆ యా ప్రదేశాలలోని నృత్య కళను పరిశోధించ గలిగితే మన ప్రాచీన నృత్య కళా రూపంగురించి తెలుసు కొనవచ్చునన్న తలంపుతో ఆ దేశాల శిల్పాల నెన్నింటినో పరిశీలించాను, ఎన్నో మత గ్రంథాలను పరిశోధించాను. బలి, జావా, సయ్యాం దేశాలలోని ఆరాధనా విధానాలను, ఆరాధనా సమయంలో వారు పట్టే ముద్రల తీరును అధ్యయనం చేస్తూవచ్చాను. చివరకు ఢిల్లీలో మహర్షి మహేశ్ యోగి వారి వేదవనంలో నన్ను కలుసుకొన్న ఆ జపనీయుడు ఒక ఆధారాన్ని కల్పించాడు. వీలయితే ఈ యాధారంతో పరిశోధనలు జరుపుతాను.

ఆంధ్రుల నృత్యకళకు సంబంధించి నంతవరకు భరతముని, నందికేశుడు, వాయసేనాని జాయపసేనాని త్రిమూర్తులవంటి నాట్య శాస్త్రవేత్తలు. భరతుడు తన నాట్య శాస్త్రంలో కేవలం బహుపాత్రల నృత్యనాటక కళారీతిని గురించి వివరంగా వర్ణించాడు. నందికేశుడు మాత్రం తన అభినయ దర్పణంలోను భరతార్ణవం లోను ఏకపాత్ర నృత్యకేళికను గురించి వివరించాడు అయితే ఇతడు భరతముని కంటే ముందున్నవాడా, తర్వాతివాడా ? అన్నది ఒక చర్చనీయాంశమే అయినా అది మనకు ప్రస్తుతం అనవసరం

నందికేశుడు నృత్త, నృత్య, అభినయాలను విడదీసి, విడమర్చి, వివరించాడు. నృత్తహస్తాలను, నృత్యహస్తాలను అభినయ హస్తాలను, సహజ హస్తాలను, ముద్రలను వేరువేరుగా విడదీశాడు కనుక అతడు రచించిన రెండు శాస్త్ర గ్రంథాలు ఏకపాత్ర కేళికా నృత్యాలకు సంబంధించినవే.

బహుపాత్రలు గల కేళికలో ఒక కథను అనుసరించి ఆ కథలోని పాత్రలు ప్రవేశించి, నాట్యం చేయడం జరుగుతుంది గనుక దీనిలో వివరణను పాటించవలసిన ఆగత్యముండదు.

ఒకే పాత్ర నాట్యాన్ని ప్రదర్శించవలసి వచ్చినప్పుడు ఆ ప్రదర్శనను ఎలా ప్రారంభించాలి ? ప్రదర్శించదలచుకొన్న నాట్యాంశాలు ఏ క్రమంలో ఉండాలి ? సభను రక్తి కట్టించాలంటే ఏ అంశం తర్వాత ఏ అంశాన్ని ప్రదర్శించాలి ? ఎంతవరకు నృత్త ముండాలి ? నృత్యాన్ని ఎలా ప్రదర్శించాలి ? అభినయం ఏ విధంగా ఉండాలి ? ఈ ప్రశ్నలకు సరైన సమాధానాలు కేళిక చేసేవారికి తెలిసి యుండాలి. ఈ విషయాలన్నీ ముఖ్యంగా స్త్రీల లాస్య ప్రదర్శన పద్ధతికి సంబంధించినవి.

బహుపాత్రల నృత్యనాటక ప్రదర్శనలో కథను అనుసరించి, పాత్రను బట్టి పాత్ర ప్రవేశం, నాట్యప్రారంభం, ముగింపు ఉంటాయి. కథానుసారం వీటిలో మార్పులు వస్తూ ఉంటాయి. ఏకపాత్రకేళికలో ఇలా ఉండదు. దీనికొక ప్రత్యేక పద్ధతి, క్రమం ఉన్నాయి. ఆటలోని ఛందస్సులు మారినా, పాటలు మారినా

ప్రదర్శన క్రమం మారదు. దీనిని శుద్ధనృత్తంతో ప్రారంభించి, అభినయంతో ముగిస్తారు.

రాజులు, రాజ్యాలు, ప్రజల మత విశ్వాసాలు మారినందువల్ల ఆ యా పాటలలోని ఇతివృత్తాలు, కౌతాలు, కైవారాలు మారుతాయే గాని ఆటక్రమం ఏకపాత్రకేళికలో మారదు. మారకూడదు, మారితే శాస్త్రీయ పద్ధతి కాదు.

తిక్కన భారతంలోని నాట్యవర్ణనలు, శ్రీనాథుని పల్నాటిసీమ రాజ దర్బారు వర్ణనలు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

తన కాలంలో ప్రచారంలో నుండిన అనేక శివ సంబంధిత నాట్యాలు, ప్రాంతీయ నాట్యాలు, దేశి నాట్యాలు గురించి జాయప తన నృత్తరత్నావళిలో చర్చించాడు. వీటినే కాక రాజాస్థానంలో ప్రదర్శించదగిన ఏకపాత్ర కేళికా నర్తన రీతిని, శిక్షణ క్రమాన్ని, నర్తకి సభా ప్రవేశపద్ధతిని గురించి కూడా చర్చించాడు. నర్తకి సభా ప్రవేశం చేసేటప్పుడు ఎటువంటి తెరను పట్టాలి ? దాని పొడవు, వెడల్పులు ఎంతెంత ఉండాలి ? ఈ విషయాలను గూడా అతడు తెలియజేశాడు. రాజనర్తకి సభలోకి ప్రవేశించిన తర్వాత వాద్యబృందం కుతుపం చేసే తీరును గూడా జాయప తెలియజేశాడు. అంబరం, అయిత్తం, నర్తకి తెరవెడలే తీరు, తీరికలు, మొహర, ముక్తాయులు మొదలైన విషయాలనన్నింటిని ఆయన వివరించాడు. ఇదంతా ఒక క్రమపద్ధతిలో జరగాలి. మార్చడానికి వీలు లేదు. దీనికి శాస్త్రీయమైన కారణాలు ఉన్నాయి. మన పూర్వులు ఎంతో పరిశీలించి, పరిశోధించి, చర్చించి రూపొందించిన పద్ధతి ఇది.

దేశాన్ని పాలించే రాజు కొలువైయుండగా, ఆ కొలువులో విద్వాంసులు, పండితులు, కవులు, విద్యావేత్తలు, విమర్శకులు, రసజ్ఞులు మొదలైన వారంతా ఆశీనులై ఉండగా రాజనర్తకి ఈ విశిష్టమైన పద్ధతిలో కేళికను ప్రదర్శించాలి. ఈ క్రమ పద్ధతిని అనుసరిస్తే గాని కేళిక రక్తి కట్టదు. అప్పుడు గాని ప్రేక్షకులు సంపూర్ణ రసానుభూతిని, రసానందాన్ని పొందలేరు, రసలోకంలో విహరించలేరు. ఇటువంటి కేళిక కేవలం ఒక వినోద క్రీడకాదు, అదొక విజ్ఞాన విందు.

పాటపాడేవాడికి, వాయిద్యాలను వాయించేవారికి సంపూర్ణంగా భాషాజ్ఞానం, ఛందశ్శాస్త్ర పరిచయం లేకపోయినా పరవాలేదు. వారు శ్రుతి, రాగ, తాళాలపై ఆధారపడి రాగరసాన్ని పాటభావాన్ని ప్రేక్షకులపై కురిపించి, వారిని సమ్మోహితులను జేయగలిగితేచాలు. పాటలు వ్రాసే కవులకు ఛందశ్శాస్త్రం అలంకార శాస్త్రం, వ్యాకరణ శాస్త్రం భాషాజ్ఞానంతో బాటు తెలిసియుండాలి. ఈ కవులకు సంగీత శాస్త్రంతో పరిచయముంటే చాలు. సంగీత పరిజ్ఞానం సంపూర్ణంగా ఉంటే మరీ మంచిది. కాని నర్తకుల విషయంలో అలాకాదు. వీరు భరతశాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. నృత్త, నృత్య, అభినయాలను గురుముఖంగా పూర్తిగా అభ్యసించాలి. ఆంగిక, వాచిక, సాత్వికాభినయాలను క్షుణ్ణంగా అలవరచుకొని ఉండాలి. కావ్యాలు, ప్రబంధాలు చదివి ఉండాలి. సంగీతం నేర్చుకొనాలి. ఛందశాస్త్రంతో పరిచయముండాలి. రాగ తాళాలు తెలిసియుండాలి నాద స్వరూపం తెలిసియుండాలి. మూర్తి ప్రతిష్ఠ, ధ్యాన విధానం అలవరచుకొని ఉండాలి. భాషా జ్ఞాన ముండాలి, వ్యాఖ్యాన పటిమ ఉండాలి, తర్క శాస్త్రాన్ని అభ్యసించి యుండాలి, వాక్చాతుర్యం, మృదు మధుర సంభాషణా చతురత కలిగి ఉండాలి ఈ యర్హతలన్నీ ఉన్నవారే ఆస్థాన నర్తకులుగా పూర్వ ముండేవారు. ఇంతటి గొప్ప శిక్షణను నర్తకులకు ఇవ్వగలిగినవాడే ఆస్థాన నాట్యాచార్యుడుగా ఉండేవాడు. ఇటువంటి నాట్యాచార్యుని వద్ద శిక్షణ పొందిన నర్తకులలో ఉన్నతురాలైనవారికి ఆస్థాన నర్తకి పదవి లభ్యమయ్యేది.

ఆస్థాన నర్తకిగా ఎంపికయ్యేముందు ఆ కళాకారిణి ఎన్నో పరీక్షలను ఎదుర్కొనవలసి వచ్చేది.

నాట్యంలో బాగా తర్ఫీదు అయిందన్న నమ్మకం నాట్యాచార్యునికి పూర్తిగా కలిగిన తర్వాత ఆ శిష్యురాలిని ఆ గురువు రాజాస్థానానికి ఒక శుభముహూర్తాన తీసికొని వెళ్ళేవాడు. ముందుగా భరత శాస్త్రవేత్తలు ఆమెకు భరతశాస్త్రంలో గల పాండిత్యాన్ని పరీక్షించేవారు. ఆకృతిరును నిశితంగా పరిశీలించేవారు. ఆమె సంగీత పరిజ్ఞానాన్ని ఆస్థాన సంగీతజ్ఞుడు పరీక్షించి, ఆమె గాత్ర మాధుర్యాన్ని, గాత్ర ధర్మాన్ని పరిశీలించేవాడు. భాషావేత్తలు ఆమె భాషా పాండిత్యాన్ని,

కావ్యపరిచయాన్ని పరీక్షించేవారు. అలంకార శాస్త్రంలో ఆమెకు గల పరిజ్ఞానాన్ని ఆ శాస్త్రవేత్తలు పరీక్షించేవారు. సకల శాస్త్రాలలోను ప్రావీణ్యం సంపాదించి ఈ పరీక్షలలో నెగ్గినవారికే "ఆస్థాన నర్తకి" పదవి లభ్యమయ్యేది. ఇతరులు రాజాస్థానంలో నర్తకులుగానే ఉండేవారు. అయితే ఈ నర్తకులలో కొందరు నృత్తంలోను, కొందరు నృత్యంలోను కొందరు అభినయంలోను ప్రత్యేక సాధన చేసి నిష్ణాతులై ఉండేవారు. ఆ యా శాఖలలో వారికి ఆధిపత్యం ఉండేది.

రాజాస్థానంలో నర్తకులుగా ఉండిన వారందరికీ ఎంతో గౌరవం ఉండేది. అయితే ఆస్థాన నర్తకికి మాత్రం సకల మర్యాదలూ జరిగేవి. ఈ రాచమర్యాదలు ఎన్ని విధాలుగా జరిగేవో చెప్పడం కష్టం. ఆస్థాన కళారంగంలో ప్రథమ తాంబూలం ఆస్థాన నర్తకిది. ఆస్థానానికి వచ్చి వెళ్లడానికి ముత్యాల పల్లకీని ఆమెకు ఏర్పాటు చేసేవారు. పగటి దివిటీలవారు పల్లకీ ముందు నడుస్తూంటే బిరుదు మిటారులు స్తోత్రగానం చేసేవారు.

నా పూజ్య గురువులు శ్రీమతి నాయుడుపేట రాజమ్మ, మైసూరు వేంకట లక్ష్మమ్మ, బొబ్బిలి జీనరత్నమ్మ గార్లు ఈ రాచమర్యాదలను గురించి నాకు తెలియజేశారు.

నాయుడుపేట రాజామణి (రాజమ్మ, రాజవ్వ) గారు భరత శాస్త్రనిధి. ఆమె చాలా సంస్థాలకు వెళ్లి కేళికలు చేసి ఆ యా ప్రభువులు, పండితులు, విద్వాంసులు, శాస్త్రవేత్తలను తమ కేళికలతో మెప్పించి, వార్షికాలను సత్కారాలను పొందిన కళాకారిణి.

ఒకసారి వేంకటగిరి సంస్థానాధీశులు "ఒక్కసారికే ఇలాగైతే ఓహో ఇది ఏటి రతిరా ? మక్కువ దీర్చరా మా మువ్వ గోపాల" అన్న పదాన్ని అభినయానికి సమస్యగా ఇచ్చి ఒక పోటీపందిది పెట్టారు ఆ పోటీలో పాల్గొన్న ఇతర నర్తకులు ఒక రోజు, రెండు రోజులపాటు అభినయించి ముగిస్తే రాజమ్మగారు

తొమ్మిది రోజులపాటు ఈ అసంతృప్త నాయిక పదాన్ని అభినయించి భరతశాస్త్ర నిధిగా సత్కరింప బడ్డారు.

బొబ్బిలి ఆస్థాన నర్తకిగా నుండిన జీవరత్నమ్మగారు ఆమె ఆఖరి దశలో మా నృత్య నికేతన్ బాల బాలికలకు అభినయం నేర్పుతూ మా వద్దనే ఉండేవారు. ఈమెగురించి వివరంగా రుద్రగణిక రెండవ భాగంగా వ్రాస్తున్నాను. ఈమెను బొబ్బిలి ఆ స్థానంలో ఎంత గౌరవించేవారో తెలియజేయడానికి ఒక ముచ్చట ఇక్కడ చెప్పదలచాను.

బొబ్బిలి రాజావారి పట్టాభిషేక మహోత్సవానికి దక్షిణాదినుండి కొందరు నర్తకీమణులు, వెంకటగిరినుండి సుమారు వందమంది నర్తకీమణులు వచ్చారు. ఆ రోజుల్లో నర్తకీమణులకు ఒక కట్టుబాటుండేది. తోపురంగు పైజామా ధరించి, దానిపైని ఆరుగజాల తెల్లని కుచ్చుల పరికిణీని కట్టుకోవాలి. దీనినే కొంతమంది పైటపరికిణీ అని, లంగా అని, ధావణీ అని అంటారు ఆ లంగాను మధ్యకు దోపి, గోసిగా బిగించి, దానిపైటను నడుముకు చుట్టూ వచ్చేలా మడిచి దోపాలి. కోలాటం ఆడినా, జతిస్వరాలు ఆడినా, గోవింద సామయ్య పెద్దవర్ణాలు ఆడినా. మోహనవర్ణం ఆడినా ఇదే వారి వస్త్రధారణ. ఇదే వారి పద్ధతి.

ఈ వస్త్రధారణ పద్ధతి ఆస్థాన నర్తకి జీవరత్నమ్మకు ఎందువల్లనో నచ్చలేదు. ఈ విషయాన్ని ఆమె రాజావారికి విసికిడి చేసింది. "ప్రభువుల వారికి చిన్న మనవి, ఆ దక్షిణాదివారి వేషధారణ పద్ధతి నాకు నచ్చలేదు. దానిని ధరించలేను. అందుకు ప్రభువులవారు మన్నించగలరు."

"నిన్ను అలా వస్త్రధారణ చేసికొనమని ఎవరైనా చెప్పారా జీవరత్నం ? నీవు మా ఆస్థాన రత్నానివి నీ పద్ధతినే నీవు అనుసరించవచ్చు" అని రాజావారు సెలవిచ్చారట.

"నేను తమ ఆస్థాన నర్తకిని కనుకనే మీ యాజ్ఞకోసం ముందుగా విన్న వించుకొంటున్నాను," అని అన్నది ఈమె.

ఆనాటి సంస్థానాలలో ఇటువంటి ఆచారాలు ఉండేవి. ఆనాటి ప్రభువులకు, కళాకారులకు మర్యాదలు ఇచ్చి పుచ్చుకోవడం తెలుసు. వీటిని నృత్యశిక్షణలో ఒక భాగంగా నర్తకులకు నాట్యాచార్యులు నేర్పేవారు. పూర్వం నాట్యకళలలో శిక్షణకోసం గురువులవద్దకు వచ్చిన బాలికలను ఎంపికచేసి విద్యనేర్పేవారు. ఆటకు పనికివస్తుందన్న వారినే ఎన్నుకొనేవారు. సాముద్రికంగా కూడా పరీక్షించేవారు. శిక్షణ పొందుతున్న బాలికలకు వయస్సు వచ్చిన తర్వాత వారు ఏ స్త్రీజాతికి చెందినవారో తెలుసుకొని ఆస్థాన నర్తకిగా పనికి వచ్చే లక్షణాలు గల జవ్వనికి మాత్రమే ప్రత్యేక శిక్షణ ఇచ్చేవారు.

పద్మినీ జాతి స్త్రీకి ఉత్తమనాయిక లక్షణాలు ఉంటాయి. అందువల్ల స్వేచ్ఛగా అభినయించలేక పోవచ్చును. కనుక వీరికి ఆగమ శాస్త్రానుగుణమైన నాట్యాన్ని నేర్పేవారు. హస్తినీ జాతి స్త్రీలు చాలా శ్రమించి వారి శరీరాన్ని అదుపులో పెట్టుకోవలసి యుంటుంది. వీరు కేళికలనుండి విరమించేవరకు కొన్ని నియమ నిబంధనలకు లోనై యుండవలసి యుంటుంది. శంకిణీ జాతి స్త్రీల శరీర సౌష్టవం ఉదాత్తమైన దైనా అభినయానికి ఒప్పదు. నృత్యకేళికలకు చిత్తినీ జాతి స్త్రీలు తగినవారని ఎంచి, ఇతర లక్షణాలు గూడా సరిపోతే వారికి ప్రత్యేక శిక్షణ ఇచ్చేవారు అటువంటివారు ఉత్తమనాయికలుగా వెలుగొందేవారు.

చిత్తిని లేక చిత్రిణీ జాతి స్త్రీ సంగీతప్రియురాలు, సౌందర్యోపాసకురాలు అలంకరణ యందు మక్కువ గలది కవితా పఠనమందు, రచనా వ్యాసంగ మందు ఆసక్తి గలది. ఒక సుందర నందనవనంగా తన జీవితాన్ని రూపొందించు కొని, సౌందర్యోపాసన చేస్తూ ఇతరులకు వాటియందు ఆసక్తి కలిగించ గలది. మృదుమధురమైన వాక్కు, సంభాషణా చాతుర్యం, లలిత కోమలమైన భావ వికాసాలందు అభిలాష గలది. ఆకర్షణీయమైన అంగసౌష్టవం గలది. పాదాల నుండి శిరస్సువరకూ తాళలయలకు అనుగుణంగా స్పందించగల పొందికైన శరీర సౌష్టవం గలది. చిత్రాభినయంతో ఎలా అభినయం వికసిస్తుందో అలాగే ఈమె విద్య ఈమె గుణాలతో విరాజిల్లుతుంది. అందుకే చిత్తినీ జాతికి చెందిన

జివ్వనినే ఎన్నుకొని నృత్యవిద్యలో ప్రత్యేక శిక్షణ ఇచ్చి ఆస్థాన నర్తకిగా రూపొందించేవారు

ఒక శుభముహూర్తాన బాలికలచేత వినాయకపూజ చేయించేవారు. ఆ తర్వాత తొక్కాటం, సాముతో నృత్య శిక్షణ ప్రారంభమయ్యేది. ఈ రెండూ చాలా ముఖ్యమైనవి. వీటిపైని నర్తకి భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. ఈ తొక్కాటం, సామును సాధన చేస్తున్నప్పుడు ఇతరులను చూడనిచ్చే వారు కారు.

నృత్యశిక్షణకు ఎంపిక చేయబడిన బాలనర్తకులకు సాము చేయించే ముందు శరీరాన్ని ఒక ప్రత్యేకమైన తైలంతో మర్దించేవారు. కాలి మడమలతో తొక్కి వీపుకు వెన్నెముకకు వ్యాయామం చేయించేవారు. అందుకే దీనికి తొక్కాటం అన్న పేరు వచ్చింది.

రకరకాల ఓషధులను, వనమూలికలను వేసి ఈ తైలా న్ని తయారుచేసి దానిని ఆరు నెలల పాటు భూమిలో పాతి ఉంచి, తర్వాత వెలికితీసి యుపయోగించేవారు.

మొగ్గలు వేయడం, రకరకాలుగా దండేలు తీయడం, చారీ కరణ విన్యాసాలు, స్థానకాలు ప్రదర్శించడం ఈ సాములో నేర్పేవారు. ఈ సామును కొన్నాళ్ళు చేసేసరికి బాలల శరీరాలు మైనం ముద్దల్లా తయారయ్యేవి మేలిమి బంగారంతో కావలసిన ఆభరణాలు చేయించుకొనడానికి వీలవుతుంది. అలాగే ఈ బాలికల శరీరాలు కావలసిన భంగిమలను ప్రదర్శించడానికి అనువుగా తయారవుతాయి. అప్పుడు దృష్టి, గ్రీవ భేదాలు, రేచక విన్యాసాలు, నృత్త, నృత్య, అభినయహస్తాలు, అడవులు, అడుగులు, భంగిమలు నేర్పేవారు. దీనినే అడవు సాము అంటారు ఈ యడవుసాము ముగిసిన తర్వాతనే నృత్యం లో సాధారణంగా ఉపయోగించే తాళాలను, లయవిన్యాసాలను, సంగీతాన్ని, ఆంధ్ర గీర్వాణ భాషలను సాధన చేయించేవారు. ఆ తర్వాత అడవులతో చేర్చి చిన్న చిన్న జతులను, తీర్మానాలను తాళయుక్తంగా సాధన చేయించేవారు. ఇలా

కొంతకాలంపాటు నృత్యాన్ని సాధనచేసి, దానిని నిర్దుష్టంగా ప్రదర్శించ గలిగిన తర్వాత, చిన్న చిన్న గీతాలకు నృత్యం నేర్పేవారు.

రామాయణ, భాగవత, భారతాది కథలకు సంబంధించిన గీతాలకు నృత్యాన్ని ప్రదర్శించడం నేర్పిన తర్వాత సాత్వికాభినయానికి వచ్చేవారు. అయితే దీనికి ముందు పాటలు పాడడంలో శిక్షణ యిచ్చేవారు. కావ్యాలను ప్రబంధాలను చదివించేవారు.

దీని తర్వాత "అంగశుద్ధి" అనే క్రమానికి వచ్చేవారు. నర్తకి, నృత్త, నృత్య విన్యాసాలలో ఏవైనా లోపాలుంటే ఈ అంగశుద్ధి క్రమంలో సరిదిద్దేవారు.

ఇదివరకు కేళికలు చేసి విరమించిన ప్రౌఢనర్తకిని చెంతనిడుకొని యువక నర్తకి భంగిమలను ఒక్కొక్కదానినే నాట్యాచార్యుడు తీర్చిదిద్దేవాడు. భంగిమల పొందికలలో లోపాలుంటే ఆ అనుభవజ్ఞురాలి అభిప్రాయాన్ని తీసికొని, సవరించేవాడు.

ఈ విధంగా భరత విద్యనంతటినీ నేర్చుకొన్న తర్వాత, భరతశాస్త్రం, అభినయశాస్త్రం, అలంకారశాస్త్రం మొదలైన వాటిలో ఆరితేరిన సంస్కృతాంధ్ర పండితుల సమక్షంలో ఆ నర్తకికి పరీక్ష జరిగేది. ఈ పరీక్షలో నెగ్గిన వారే కేళికలు ప్రదర్శించడానికి అర్హులయ్యేవారు. ఈ యర్హతను సంపాదించినవారు విద్వాంస, కవి, పండిత గాయకుల సమక్షంలో "రంగపూజ" చేసేవారు. దీనినే రంగప్రవేశం అంటారు. అంటే సభలలో ఇచ్చే ప్రదర్శనలకు ఇది తొలి ప్రదర్శన.

ఈ రంగపూజ ఒక పరీక్ష వంటిది. ఆస్థానంలో కేళికలు చేసే అర్హతను సంపాదించుకొనడానికి ఇదొక పరీక్ష. దీనిలో నెగ్గిన తర్వాత, తనకు భరత విద్యలో గల ప్రావీణ్యాన్ని పండితులు పరీక్షించేవారు. ఆ తర్వాతనే ఆస్థాన ప్రవేశానికి అర్హత వచ్చేది.

బాలిక తన అయిదవ సంవత్సరంలో నృత్యకళను నేర్చుకొనడం మొదలు పెడితే ఈ శిక్షణ అంతా పూర్తయ్యేసరికి ఆ బాలికకు పద్నాల్గు సంవత్సరాల వయస్సు వచ్చేది. అంటే పది సంవత్సరాలు కష్టపడి భరత కళను నేర్చుకొనే వారు ఆ తర్వాత పది పన్నెండేండ్లు కేళికలు ప్రదర్శించి ఆ నర్తకి విరమించేది

సుమారు ఇరవై అయిదు సంవత్సరాల వయస్సువరకూ భంగిమలు కరణాలు అంగహారాలు ప్రదర్శించడానికి నర్తకి శరీర సౌష్టవం అందంగా ఆకర్షణీయంగా ఉత్తమమైనదిగా ఉంటుంది ఆ తర్వాత శరీరం సడలిపోవడంవల్ల వినోద కేళికలకు అనువుగా ఉండదు. కాని వీరు విజ్ఞానవంతమైన సభల్లో సాత్వికాభినయాన్ని ప్రదర్శిస్తూ వచ్చేవారు. పది, పదిహేను సంవత్సరాలపాటు కేళికా ప్రదర్శనలలో పాల్గొన్న తర్వాతనే గదా సాత్వికాభినయ ప్రదర్శనకు ప్రౌఢత్వం వచ్చేది. సాత్వికాభినయంలో పండిపోయి దిట్టలైనవారు వృద్ధాప్యం వచ్చేవరకు ఆస్థానాలలో ఉండేవారు.

సాధారణంగా పండిత సభల్లో, ఆట కచ్చేరీలు చేసే నర్తకులకు ఆస్థానాలలో స్థానం ఉండేదికాదు. ఆస్థానాల కట్టు బాట్లు, పద్ధతులు వేరు. అవి వీరికి సరిగ్గా తెలియవు భరత విద్యనభ్యసించి సామాన్య ప్రదర్శనలు ఇవ్వడం వేరు, ఆ స్థానాలలో ప్రదర్శన లివ్వడం వేరు. ఆస్థాన నృత్య కేళికా పద్ధతిలో శిక్షణ పొందినవారికే దేవిడీ ప్రవేశానికి అర్హత ఉండేది. అలాగే ఆలయంలోని నృత్య పూజ చేసేవారుగూడా ప్రత్యేక శిక్షణ పొందవలసి యుండేది. నృత్య పూజా క్రమాన్ని సంపూర్ణంగా ఎరిగినవారికే ఈ యర్హత ఉండేది. గాలిగోపురం దాటి ఆలయంలోపల గజ్జెలు కట్టడానికి కూడా ఇతరులకు అర్హత ఉండేది కాదు అనుమతి లభించేది కాదు.

నృత్య ప్రదర్శనాలలో వాయిద్యకులు, నట్టువరాండ్రు కూర్చునే ఆచారం పూర్వం లేదు ముప్పయి అయిదు సంవత్సరాల క్రితం నేను భండారు సంస్థానంలో నాట్యకచేరీలు చేస్తూండినప్పుడు కూడా నాకు ఇరుప్రక్కలా వాయిద్యకులు

నిలబడి వాయిద్యాలు వాయించేవారు, తర్వాత, తర్వాత వాయిద్యకులు, నట్టువరాండ్రు కూర్చుని వాయించే ఆచారం వచ్చింది.

వాయిద్యకులు తలపాగాలు చుట్టుకొనే వారు. శ్రుతికి తిత్తి పోసేవారు. కొన్నాళ్లకు తిత్తిపోయి పాముల బూరా వచ్చింది. ముఖవీణ విధిగా ఉండేది ఆడే నర్తకే పాడలన్న సంప్రదాయం మన ఆంధ్ర దేశంలో ఉండేది. ఈ యాచారం వల్ల నర్తకికి భావవికాసం కలుగుతుంది. వాచికాభినయం చక్కగా పోషింపబడుతుంది. నృత్తంలో తప్ప, నృత్యాభినయాలలో ఆడే నర్తకీ పాడేది. తోపు రంగు పైజమా కట్టుకొని, దానిపైని తెల్లని చీరను కాసిబోసి కట్టుకొనేవారు భాగవతుల ఆహార్యం చెక్కగణియం కాని ఆస్థాన నర్తకులు మాత్రం కేవలం బంగారు నగల్నే ధరించేవారు.

కేళిక చేసే నర్తకి తనకు సంగీతంలోను, అభినయంలోను, అంటే సాత్విక శుద్ధ సాత్వికాభినయాలలో గల పాండిత్యాన్ని పూర్తిగా ప్రదర్శించేది. ఈ యభినయాలను నర్తకి విధిగా కూర్చునే ప్రదర్శించేది. ఈ యభినయకళ భరత విద్యలోని సారం, భరతానికి హృదయం, భరత కళకు తలమాణిక్యం. ఈ విద్యలో నిష్ణాతులైన వారిని విశేషంగా గౌరవించేవారు. ఇక ఏదైనా శ్లోకాన్ని గాని పదాన్నిగాని అభినయించేటప్పుడు అలంకార శాస్త్ర, రసశాస్త్రాలలోని పుటలను ఒకదాని తర్వాత మరొక దానిని చదివి వినిపిస్తున్నట్టుగా అభినయించి, సాత్విక సంచారులను నిరూపించేవారు, ఆ నర్తకీమణులు.

నర్తకి సభాప్రవేశం చేసిన తర్వాత వాద్యగాండ్రు మేళప్రాప్తి చేసేవారు అప్పుడు నర్తకి "సమనఖ"లో నిలబడి, చతుర్వర్ణ చూర్ణికను పఠించి, పుష్పాంజలి ఘటించేది. ఆ తర్వాత భూచారీ, ఆకాశచారీ విన్యాసాలు గల అడ్డితాన్ని ప్రదర్శించేది. ఇంతవరకు నృత్త ప్రాధాన్యత గల ఆటక్రమాన్ని ప్రదర్శించేది.

ఆ తర్వాత నర్తకి ఆ యాస్థానాధీశుని పైని కైవారం ప్రదర్శించేది. ఈ స్తోత్ర గీతాన్ని ప్రధానంగా నృత్త, నృత్యాలతో, ప్రదర్శించి మొగ్గి ముగించుట ఆచారంగా ఉండేది. ఈ కైవారాలను ఛందోగీతా లంటారు. వీటిలో ఆ యా

రాజులను కీర్తించడమే గాక వారి వంశావళిని తెలియజేస్తూ, వారి పూర్వులను గూడ కీర్తించేవారు. ఈ కైవారాల వల్ల కొంతవరకు చారిత్రకాంశాలు తెలియ వస్తాయి.

కైవారం తర్వాత "యతినాట్యం" చేసేవారు. దీన్ని పల్లవి ఆట అని గూడా అంటారు. జతులతోగూడిన నృత్తం గనుక నేడు దీనిని జతిస్వరం అంటున్నారు. సర్వ పల్లవి, సాహిత్యపల్లవి, శబ్దపల్లవి అని ఈ పల్లవి మూడు రకాలైనది వీటిలో స్వరానికి, మృదంగ జతులకు, అడవులు, తీర్మానాలు ప్రదర్శింపబడతాయి. జతుల ఆటలో నృత్తహస్తాలు ప్రదర్శింపబడతాయి.

ఈ యతి నాట్యంలో మరొక విశిష్టత ఉంది. సమయతి, విషమయతి, డమరుకయతి, మృదంగయతి, పిపీలకయతి మొదలైన వాటిలో జతులను కూర్చి, తీర్మానించడం ఒక ఆచారం అంతేకాక దీనిలో గతి ప్రస్తారం చేసేవారు. మనుష్యగతి, మరాళగతి, హరిణిగతి, తురంగగతి, మత్తేభగతి, ఉరగగతి మొదలైన వాటిని ఇందులో ప్రదర్శించేవారు. నాగబంధ, ఖడ్గబంధ, ఛత్రబంధ, పద్మబంధ మొదలైన రచనలను, ప్లవనాలు, భ్రమణాలు, భ్రమరాలు మొదలైనవాటి నన్నింటిని కూర్చి ప్రదర్శించేవారు. అయితే ఇవి గూడా రస భావం లేని శుద్ధ నర్తనాలే.

వీటి తర్వాత రామాయణ, భారత, భాగవతాలలోని పౌరాణిక కథలకు వర్ణనాత్మక గీతాలలో ఆంగిక ప్రాధాన్యం గల నృత్యాన్ని ప్రదర్శించేవారు. దీని తర్వాత ధ్రువపద కేళిక [ధ్రువాగానం], నవపద కేళిక, చతురంగ గీతాలకు ఆట, అభినయం జక్కిణి మొదలైన వాటిని ఒక క్రమంలో ప్రదర్శించేవారు.

కొన్ని ఆస్థానాలలో మత్తల్లి, హల్లీసిక, మొదలైన వాటిని ప్రదర్శించే వారు. రకరకాల కోలాట కోపులను గూడ బృందనాట్యాలుగా ప్రదర్శించేవారు.

ఈ యాస్థాన నర్తనాలలో "శబ్ద చూడామణి" అనే ఒక విశిష్ట నర్తన ముండేది. దీనిలో వివిధ భావాలకు మృదంగ జతులను వాయిస్తూంటే వాటికి అనుగుణంగా నర్తకి కేళికను ప్రదర్శించేది.

రథాలు, ఏనుగులు, అశ్వాలు, కాల్బలాలనే చతురంగ బలాలు రాజులకు ఉండినట్లే నాలుగు చరణాలు గల చతురంగ గీతాలు నాట్య ప్రదర్శనలలో ఉండేవి. ఆ యా చరణాలకు గల ఛందస్సు అనుసారం నర్తకి నృత్త, నృత్యా లను ప్రదర్శించేది. ఈ చతురంగ నర్తనం, శబ్ద చూడామణి జతుల ప్రదర్శనం కష్టమైన నాట్యాంశాలు. ఇవి నేడు లేవు పూర్తిగా అదృశ్యమై పోయినట్టే భావించ వచ్చును.

ఏ యాస్థాన నర్తకి ఎన్ని రకాలైన నర్తనాలను ప్రదర్శించినప్పటికి వీటన్నింటికి నృత్తం, నృత్యం అభినయాలే మూలాధారం.

ఆ యా రాజులు స్వీకరించిన మతాలను అనుసరించి ఆ యా మతాలకు సంబంధించిన అంశాలను ఈ యాస్థాన నర్తకులు ప్రదర్శించేవారు.

శివుడు అర్ధనారీశ్వరుడైతే, విష్ణువు మోహినీ కేశవుడు. శివుడు తాండవ లాస్యాలను ప్రదర్శిస్తే, విష్ణువుగూడా వాటిని ప్రదర్శించాడు. కాని వీరి ప్రదర్శ నలలో తేడా ఉంది. పరమ శివుని ఆట చారీ, కరణాంగహారాలతో గూడిన నర్తనం, విష్ణువు ఆట నృత్య, అభినయాలతో గూడిన నర్తనం. ఈ రెండు నర్తన విధానాలను రాజ నర్తకులు అభ్యసించి ప్రదర్శిస్తూ ఉండేవారు.

ఈ రెండు నర్తనాల సమన్వయ నర్తనమే హరి హర నర్తనం

"కురవంజి" అంటే కురవలనే ఒక గిరిజన తెగవారు. కురవన్ అనే ఏక వచనానికి కురవంజి ఉన్నది బహువచనం. వీరినే మనం ఎరుకల వారంటాం. ఈ ఎరుకలవారి నర్తనాన్నే కురవంజి నాట్యం అంటారు. పరమ శివుడు ఎరుకల వాని వేషంలో వచ్చి, పార్వతికి సోది చెప్పాడు. అలాగే శ్రీనివాసుడు ఎరుకత రూపంలో వచ్చి, పద్మావతికి సోది చెప్తాడు. ఈ కురవంజి నాట్యం ఒక ప్రత్యేక మైన శైలిలో ఉంటుంది. ఈ ఎరుకల స్త్రీలు పట్నాలకు, పల్లెలకు వచ్చి గృహిణులకు ఎరుక చెప్పడం ఈ నాటికీ ఉంది. వీరి ఆహార్యం, వస్త్రధారణా ప్రత్యేకంగా ఉంటాయి. వీరి చేతిలో ఒక బుట్ట, ఒక చిన్న కర్రా ఉంటాయి,

వారి మాట తీరు ఒక ప్రత్యేక యాసతో పాట పాడినట్లుంటుంది. పూర్వం వీరు రాణివాసాలకు గూడా వెళ్ళి రాణులకు జోస్యం చెప్పేవారు. అందుకే శివుడు, శ్రీనివాసుడు ఎరుకల వారి వేషాలుధరించి వారి ప్రియురాండ్ర వద్దకు వెళ్ళేరు.

ఈ ఎరుకల సాని వేషకథ (నాట్యం) దేశీయమైనదైనా ఆస్థాన కేళికల్లో ప్రాముఖ్యత సంపాదించుకొంది.

కాకతీయుల కాలంనుండి విజయనగరం సామ్రాజ్యాధిపతులు, రెడ్డిరాజులు, వెలమదొరలు, క్షత్రియ ప్రభువుల కాలంవరకే కాక, దక్షిణాదిని మధుర, తంజావూరుల నేలిన నాయకరాజుల కాలంవరకూ పై నర్తన రీతులన్నీ ప్రచారంలో ఉండేవి. నాయకరాజుల తర్వాత మహారాష్ట్ర ప్రభువులు తంజావూరును పరిపాలించారు. వీరి మాతృభాష తెలుగు కాకపోయినా తెలుగుభాషను ఆదరించి, అభ్యసించి, అనేక నృత్యా సంగీత రచనలను తెలుగులో చేశారు.

వీరి కాలంలోనే "పదవర్ణాలు" నృత్యకేళికల్లో నూతనంగా ప్రవేశించాయి. అంతకు ముందుండిన దురుపద కేళికల స్థానాన్ని ఇవి ఆక్రమించుకొన్నాయి. వీరి కాలంలోనే కాశీనాథ కవి, వీరభద్రకవి మొదలైనా వారు సలాంజతులను, శబ్దాలను కొత్తగా రచించారు. పదాలు అప్పటికి ఉండినా వీరు కొత్తగా జావళీలను రచించారు. తిల్లానా ప్రదర్శనతో నృత్యకేళికను ముగించడం ఒక ఆచారంగా వీరి కాలంలోనే వచ్చింది

భోసల వంశీయులైన ఈ మహారాష్ట్ర ప్రభువులకు పూర్వముండిన ఆట క్రమంలో మార్పులు, చేర్పులు, వచ్చాయి. కొన్ని పాత రచనలను తొలగించి, కొన్ని కొత్త రచనలను చేర్చి ఒక నూతన ప్రదర్శనా క్రమాన్ని వీరు రూపొందించారు. ఈ నూతన ప్రదర్శనా క్రమాన్ని దక్షిణాదిలోని అన్ని సంస్థానాలవారు అనుసరిస్తూ వచ్చారు.

ఈ నూతన ప్రదర్శనా క్రమంలో దురుపద, చౌపదకేళికలు, జక్కిణి చతురంగ గీతాలు, పదదరువులు మరుగునపడిపోయి; పదవర్ణాలు, తిల్లానాలు,

జావళీలు మొదలైన కొత్త రచనలు ప్రవేశించాయి. ఈ నూతన ఆటక్రమాన్ని "తంజావూరు నాట్యం" మన్నారు.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత స్వదేశీ సంస్థానాలన్నీ రద్దయి భారత దేశంలో విలీనమైనాయి. దీనివల్ల దేశ ప్రజలకు మేలు జరిగినా మన లలిత కళలకు ముఖ్యంగా నృత్యకళకు హాని జరిగిందనే చెప్పాలి. నృత్యకళా సంప్రాదాయాల నెరిగిన వారెందరో నృత్యకళను విడనాడారు. నేడు నృత్యకళ ప్రచారాలలో ఉన్నా ఆ సంప్రదాయంలోని రహస్యాలెన్నో మనకు తెలియకుండా పోయాయి. ఆ లోతైన నాట్య విద్యలు మరి మనకు లభ్యంకాక పోవచ్చును. నాకు వీలైనంతవరకు వాటిని సేకరించి, గ్రంథాలలో పొందుపరిచాను.

ప్రతి చిన్న విషయంలోను బ్రిటిష్‌వారిపైని నేరాన్ని ఆపాదించి, వారిని నిందించడం సబబుకాదు. ఈ తెల్లవారు వ్యాపారరీత్యా మన దేశానికి వచ్చి, వ్యాపార్ని కొనసాగిస్తూనే మనలో మనలను విడదీసి, దేశాన్ని కైవసం చేసి కొన్నారు. మనలను కొన్నాళ్ళు పాలించి వెళ్ళిపోయారు. అయితే వీరు మన దేవాలయాలను నాశనం చేయులేదు, లలిత కళలను పాడు చేయలేదు. మనం మన కళా సంస్కృతుల విలువలను తెలుసుకొనకుండా ఆ విదేశీ సంస్కృతి వ్యామోహంలో పడి మనమే మన చేతులతో మన లలిత కళలను నాశనం చేసుకొన్నాం. దీనికి మనమే దోషులం మనలను మనమే దూషించుకొనాలి. పూర్వం భాషా, కుల తత్వాలు లేనందునే మన నృత్యకళ తమిళ దేశంలో వర్ధిల్లింది. మన తెలుగు భాష దక్షిణాది సాంస్కృతిక భాషగా స్వీకరింపబడింది.

కాళేశ్వరం, శ్రీశైలం, ద్రాక్షారామం అనే ఈ మూడు శివ క్షేత్రాల మధ్యనుండిన దేశాన్ని త్రిలింగ దేశమన్నారు. ఇదే తెలుగు దేశం. ఈ దేశంలోని వారు మాట్లాడిన భాష తెలుగు భాష. ఈ తెలుగు వారినే నాగాసులని, నాగవాసులనిగూడా అనేవారు. ఈ దేశంలో ఒక సామ్రాజ్యాన్ని తొలిసారిగా ఏర్పాటు చేసినవారు శాతవాహనులు వారే శాలి వాహనులు. వారి తర్వాత ఇక్ష్వాకులు వచ్చారు కొండాపురం, విజయపురి, ధాన్యకటకం, అమరావతి వీరికి రాజధాను

లుగా ఉండేవి. వీరు పోషించిన లలిత కళలగురించి కొంతవరకు హాలుని గాథా సప్తశతి ద్వారా తెలుసు కొనవచ్చును. బౌద్ధ మత గ్రంథాలు మనకు లభ్యమైతే ఆనాటి ఆస్థాన నాట్యాల గురించి మనం మరికొంత తెలుసు కొనవచ్చును. మన తెలుగు వారు పూర్వం ఆరాధించిన నృత్య కళల గురించి ప్రాచీన మత గ్రంథాలలో కొంత ఉండవచ్చును.

బస్తరు, సిరువంచ మొదలైన పూర్వపు గోండు సంస్థానాలలోని, మహారాష్ట్ర నాగపూర్ మొదలైన మహారాష్ట్ర సంస్థానాలలోని, తంజావూరులోని పుస్తభాండాగారాలలోని పుస్తకాలను పరిశోధించి ఆ ప్రాంతాలలో పూర్వముండిన నృత్య రీతులను గురించి తెలుసుకొంటే, మన ఆంధ్ర దేశ నృత్య రీతులనుగూర్చి మనకు తెలుస్తుంది గంజాం, కొరాపుట్ జిల్లాలలోని సంస్థానాధీశులు పోషించిన నృత్య రీతులను మనం పరిశీలించ గలిగితే ఆ నృత్య రీతులపైని తెలుగు వారి ప్రభావం ఎంత ఉండినదో అవగాహన చేసికోవచ్చును.

"పేరిణి" గురించి కొంత ప్రస్థావించి, ముగిస్తాను.

వీరరస ప్రధానంగల ప్రేరణ నర్తనం గురించే జాయప సేనాని తన నృత్త రత్నావళిలో ప్రస్తావించాడు. అయితే రామ రాయలు ఆస్థాన నర్తకి ముద్దు చంద్ర రేఖ తంజావూరు వెళ్లిన తర్వాత ఆమె పేరిణి నాట్య ప్రదర్శన లిచ్చినట్టు చారిత్రక గ్రంథాలలో ఉంది. ఈ రెండింటి ఆటక్రమం ఒకటే గాని రెండూ ఒకటి కావు. పురుషులు మాత్రమే ప్రదర్శింపదగిన కళారీతి జాయప తెలిపిన పేరిణి మహాభారతంలో, విరాటపర్వంలో అర్జునుడు విరాటరాజు కొలువులో ప్రదర్శించిన లాస్యరీతిని ముద్దు చంద్రరేఖ తంజావూరు ఆస్థానంలో పేరిణిని ప్రదర్శించింది. జాయప తెలిపిన పేరిణి శైవమత సంబంధితమైనది. ఇది పురుషుల కళ. ముద్దు చంద్రరేఖ ప్రదర్శించినది వినోదకేళిక, స్త్రీల కళ. అదొక విజ్ఞాన విందు.

పూర్వం ఆస్థాన నర్తకీమణులు ప్రదర్శించిన భరతరీతి లాస్య పద్ధతికి చెందినది. ఇది కైశికివృత్తి ప్రధానంగా గలది. ఈ లాస్యరీతిలో నవరసాలూ ఉన్నా

శృంగార రసం ప్రధాన రసంగా ఉంటుంది. మిగిలినవి ఉపరసాలైనప్పుడు దీనిని కైశికి అంటారు. ఈ పద్ధతి పూర్వం రాజాస్థానాలలో ప్రదర్శిస్తూ వచ్చినందువల్ల దీనికి "కచ్చేరీ ఆట" అని, "దర్బారు ఆట" అని పేర్లువచ్చాయి. శాస్త్రీయ కర్నాటక సంగీత బాణీలో దీనిని ప్రదర్శించేవారు గనుక దీనికి "కర్నాటకం" అన్న పేరుకూడా వచ్చింది. సమర్థురాలైన నర్తకి నాయకు రాలుగా ఉండి ఇతర నర్తకులచే ఈ కచ్చేరీలు చేయించేది గనుక ఈ నాట్యాన్ని నట్టువమేళం అనిగూడా అన్నారు. కొన్నిచోట్ల వాయిద్యకులు అందరూ స్త్రీలే ఉండేవారు. రాజులకు, వారి ఆస్థానంలోని కవులకు, పండితులకు, శాస్త్రవేత్తలకు ఈ శాస్త్రీయమైన నాట్యాలు వినోదాన్ని కలిగించేవి గనుక వీటిని "కేళికలు" అన్నారు.

ఈ ఆస్థాన నర్తకీమణులలో కొందరి గురించి నా "రుద్రగణిక" గ్రంథంలో రచించాను. వీరిలో అత్యంత ప్రసిద్ధిగాంచిన నలుగురు నర్తకీమణుల గురించి ఇక్కడ ప్రస్తావిసాను.

(1) **మాచల్ దేవి :** కాకతీయుల కాలంలో వారి ఆస్థాన నర్తకిగా నుండిన ప్రసిద్ధ నర్తకురాలు. తన వంశ చరిత్రను యక్షగానంగా రచింపజేసి, ఆడించి చూసి, ఆనందించిన యశోధనురాలు ఈమె.

(2) **కుప్పాయి :** విజయనగరాధీశుడు శ్రీకృష్ణదేవరాయల ఆస్థాన నర్తకీమణి రంజకం కుప్పాయి, రంజకం వీరి బిరుదు. ఈమె తండ్రికి "విద్వన్న ఖారంజక" బిరుదును విజయనగరాధీశులు యిచ్చారు. ఆతని పేరు శ్రీరంగరాజు.

3 **ముద్దుచంద్రరేఖ :** పగటి దివిటీల వారు ముందు నడవగా బిరుదు మిటారులు స్తోత్రగానం చేస్తూ వెంటరాగా ముత్యాల పల్లకిలో రఘునాథ రాయలు వారి ఆస్థానానికి వెళ్ళి కేళికలు ఇచ్చిన ప్రసిద్ధ నర్తకీమణి.

(4) **భాగమతి :** తన పేర ఒక నగరాన్ని నిర్మింపజేసికొన్న ఘను రాలు ఈ నర్తకి. ఒక పేదవారి ఇంట్లో జన్మించిన ఈ నర్తకి గోల్కొండ పాదుషావారి కుమారుణ్ణి వివాహం చేసికొని హైదర్‌బేగం అయింది. భాగమతిగా ఉండినప్పుడు ఈమె పేర నిర్మింపబడిన భాగ్యనగరం ఈమె హైదర్‌బేగం కావడంతో హైదరాబాదు అయింది ఇటువంటి చిత్రమైన చారిత్రక సంఘటన ప్రపంచంలో మరెక్కడా జరగలేదు.

నృత్యం, సంగీతం, శిల్పం మొదలైన సమస్త కళలను విజయనగర సమ్రాట్ శ్రీకృష్ణదేవరాయలు వారు పోషించారు కళకు వారి రాజ్యకాలం ఒక స్వర్ణయుగం. అనేకమంది రాజులు, మహారాజులు ఆయనకు తలలువంచి నమస్కరించేవారు. అలాంటి సమయంలో తలలు వంచి నమస్కరించే ఆచారాన్ని పాటించడం ఇష్టంలేని కొంతమంది నర్తకులు ఆరెగొందెనుండి కృష్ణా జిల్లాలోని హంసలదీవికి వలసవచ్చేశారు. హంసలదీవి అన్న ఆ చక్కని పేరు వారిని ఆకర్షించిందేమో ! వీరు కొన్నాళ్లు అక్కడ వెలసిన గోపాలుని ఆరాధించి, అక్కడి నుంచి నంగిగడ్డ వెళ్లి స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు.

ఈ యుదంతాన్ని ఎవరో రాయలువారి చెవిని వేశారు రాయలువారు అందుకు కోపగించలేదు. పిచ్చుకమీద బ్రహ్మాస్త్రాన్ని వేయ లేదు వారిని అవి ధేయులుగా పరిగణించలేదు. నేటి రాజకీయవేత్తల్లాగ వారిని వెంటాడి వేటాడ లేదు. కళాప్రియుడు గనుక కళాకారుల మనస్తత్వాన్ని గ్రహించగలిగాడు. కళాకారులు స్వేచ్ఛాజీవులు. వారిని బంగారు సంకెళ్లు వేసి బంధించడం నిరుప యోగం. స్వేచ్ఛగా విహరించే కోయిల పంచమ స్వరంలో తీయగా పాడుతుంది, స్వేచ్ఛగా విహరించే భృంగరాజపక్షి ముద్దుగా మాట్లాడుతుంది. అలాగే కళాకారులను స్వేచ్ఛగా వదిలిపెడితే వారి కళ రాణిస్తుంది అని రాయలువారు తలిచి వారి మానాన వారిని బ్రతకనిచ్చారు.

శ్రీ కృష్ణ దేవరాయలు వారు అంతటి ఉదారులు గనుకనే ఆయన కాలంలో లలిత కళలు వికసించాయి, విరాజిల్లాయి. ఆంధ్రులకే కాక దక్షిణాదివారందరికీ ఆదర్శప్రాయుడయ్యాడు.

అనెగొందె నుండి కృష్ణా జిల్లాకు వచ్చిన వారిలో "నంగి" అనే ప్రసిద్ధ నర్తకురా లుండేది. ఆమె పేరనే నంగిగడ్డ వెలిసింది. అప్పటి రెండు చెరువులు ఇప్పటికీ ఉన్నాయి. ఈమె వల్లనే కృష్ణా జిల్లాకు విశిష్టమైన కీర్తి ప్రతిష్టలు నృత్య కళలో వచ్చాయి. ఒక విశిష్ట కర్నాటక సంప్రదాయ నర్తనం వెలిసింది ప్రచారమైంది.

కర్నాటక నర్తన సంప్రదాయమైన భరత విద్యలో శబ్దాలకు, సలాం జతులకు గల ప్రాముఖ్యత గురించి కొంత తెలియ జేస్తాను.

తంజావూరులో నుండిన వీరభద్రయ్య, కాశీనాథ కవి శబ్దాలను సలాం జతులను తొలిసారిగా రచించారని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడ్డారు. అంతకు ముందు ఇవి లేవు వీటికి బదులు కైవారా లుండేవి. దేవతలపైని గాని రాజులపైని గాని రచించిన స్తోత్ర గీతాలను శబ్దా లంటారు వీటి తర్వాత సలాం జతులు వచ్చాయి. వీటిని ఛందోగీతా లంటారు, ఇవి చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ గతులలో ప్రదర్శింపబడుతూ ఉంటాయి. ఈ జతుల ప్రదర్శనలో నృత్యం, ముద్రాభినయం చక్కగా ఇముడుతాయి. ఈ రచనలలో అర్థాభినయం మెండుగా ఉంటుంది. ఈ శబ్దాలను మూడు కాలాలలోను ఆడ్డం ఆచారంగా వస్తున్నది. దక్షిణాదిన తంజావూరు, కుంభకోణం, తిరువనంతపురం మొదలుకొని ఉత్తరాన బొబ్బిలి, బరంపురం వరకూ వీటిని ప్రదర్శించడం ఆచారమైంది. ఆ యా రాజుల, రాజవంశాల చరిత్ర ఉంటుంది గనుక చారిత్రక పరిశోధనలకు గూడ ఇవి ఉపయోగ కరంగా ఉంటాయి వీటిలోని భాష సరళంగా ఉంటుంది, ఆటకు అనుకూలమైన నడక ఉంటుంది. వీటిలోని ప్రారంభ గతిని ఎప్పుడూ ఛందోరీతిని ఆడడమే ఆచారంగా వస్తున్నది. ఈ ఛందస్సు ఆధారంగా ఎన్నో గతులను ప్రదర్శించవచ్చును కాని గతి భేదం ఉండకూడదు. నర్తకులు ఒకే గతిలో తమ ప్రతిభను ప్రదర్శించాలి.

ఉదాహరణకు చతురశ్ర గతిలో గల ఒక సలాం జతిని నర్తకి ప్రదర్శించ దలచుకొన్నప్పుడు ఆ గతిలో తాను ఎన్ని విన్యాసాలను ప్రదర్శించ

గలదో వాటి నన్నింటిని ఆమె ప్రదర్శించవచ్చును. అంతే కాని దీని త్రిశ్ర గతి లోనికి మార్చకూడదు. త్రిశ్ర గతిని ప్రదర్శించ దలచుకొంటే త్రిశ్ర గతిలో గల సలాం జతిని ప్రత్యేకంగా ఎన్నుకొనవలసి యుంటుంది. ఇది సంప్రదాయం.

ప్రతాప రాముని పైని వీరభద్రయ్య రచించిన **తోలి** సలాం **జతిగా** ప్రచారం పొందిన రచన. ఈ రాముడు తంజావూరు రాజుల ఇలవేల్పు.

## చతురశ్రగతి

తాంగుడు తొంగ । దిక తక । దిన్నా జేకుడు
జేకిట కిటతక । ఝుంతరి । కుంతరి । కుకు
జగాకిణకు దిత్త । తై తత్తా తతై । తాం తాం
ధిర్గుడు తాం । తత్తోంగిట గిట దిమి ।
గిట తక గిట దిమి । తక తది గిణ తోం ।
తక తది గిణ తోం । తక తది గిణ తోం ॥

జం జం - జం జం జం తాకిట
ణం ణం - ణం ణం ణం తాకిట
ఝం ఝం - ఝం ఝం ఝం తాకిట
తోం తోం - తోం తొం తొం తాకిట
జంత ణంత ఝం - ఝంత ఝంత ఝం
ఝంత ఝంత ఝం - తఝం ఝంత ఝం
జంత ణంత ఝంత తోంత - తోంత కిటత జం ॥3॥
త - తై దత్తాం -

నిరంతరము ఈ ధరన్ తంజపురి వరంబేలు । ఓ నగాధీశ్వరా నగరము వెలిసిన వరంబులను కనికరంబు తోడుత, నొసగుచు ప్రజలను కరుణతో బోచిన ప్రతాప రామస్వామి ! నీకే సలాం సలాం.

ధళాంగ తకెఝమి - తక తది గిణ తోం
తాహ ధణం దణ - ఈహ ధిమి ధిమి
తాం తాం దణ కిణ - ఝుం తరే కిణా

ప్రహ్లాదుని బ్రోచిన నరసింహ స్వామి స్తుతి :- ప్రహ్లాద పట్టాభిషేక శబ్దం మేలట్టూరు వెంకట్రామశాస్త్రి రచన. మేలట్టూరులో నృసింహజయంతి సమయంలో - ఆవూరి భాగవత మేళాలవారు ప్రదర్శించే ప్రహ్లాద నాటకాన్ని ప్రారంభించే ముందు పాడుతారు ఈ జతిని పాడి, ముగించిన తర్వాత ఆ వూరి పెద్ద ఒకరు ముఖ్య భాగవతారుకు (ప్రయోక్తకు) చందన పుష్పాదులు సమర్పించి, సత్కరించి భక్తితో సమస్కరిస్తారు ఆపై నాటకం ఆడుతారు.

ఈ శబ్దమును కూచిపూడి వారుగూడా ఆడుతున్నారు. అదిగాక వేరొక శబ్దమిది ప్రతాప రామునికి అంకితంగా చేయబడినది.

పరి పరి విధముల । ప్రహ్లాదుడు నిను
హరి హరి హరి యని । మొరలిడగను విని
దురుసుగ స్థంభము । విరుచుక వెలికడి
కర కర హిరణ్య । కశ్యపు ఎదురొమ్ము
చెరచి రక్తముల । సరగున గ్రోలిన
నరహరి పని నిను । మరి మరి పొగడగ
అర్భకు తోచిన । ఆది విష్ణునౌ
ప్రతాప రామస్వామి । నీకే సలాం సలాం.

## వీర రాఘవయ్య రచన

రాజశ్రీ భోసలకుల చంద్ర
రతి పతి సుందర రాజ నరేంద్ర
రాజ తులజ మహారాజ తనుజ
ప్రతాప సింహ సూత్రమా సలాం
అదిర ! చాలా మధించి
నీ శత్రులబట్టి వధించి
నీ మిక్కిలి కీర్తి వహించి
నలుదిక్కుల నెల్ల జయించి
నెనరుంచి, మదినెంచి
వివరించి, కరుణించి
భువిలో ఎంతటి జాణవు
ఈ భువిలో ఎంతటి జాణవు
తం దాం దాం ధీంతధీం । తోంగిట కిటతక
తాంగ తక తో తతోం
అతి శయమున జనులందరు పొగడగ
ప్రతాప రాముని కరుణను వెలయచు
ధర్మమె జయమని యెంచుచు నెప్పుడు
నడచునట్టి వీర రాఘవ సన్నుత
తోధిమి దిమి దిమి దిమి తక్కట తక
భోసలకుల చంద్రుడవై వెలిసిన
భోగ సురేంద్ర
బుధ జన సాంద్ర
భళిర ! భళిర !! తుల జేంద్రుని తనయా
ప్రతాప సింహపు బాలా సలాం
తళాంగ్ తక దిమి
తక తది గిణ తోం ॥

శ్రీ కళాహస్తి రాజులపై మాతృ భూతయ్య వ్రాసిన సలాం జతి - దీనినే కూచిపూడి నారు మకుటం మార్చి, కృష్ణ శబ్దం - వాసవ సజ్జిక నాయిక అని ఆడు తున్నారు.

రారా నీవు రార స్వామి రార
దామెర తిమ్మేంద్ర కుమార
శత కోటి మన్మధాకార
భాసుర భుజ బల రణశూర
నారీజన మానసచోర
పర రాజు శత్రు సంహార
మమ్మేరు సమాన ధీర
భరత శాస్త్ర నిధి నీవేర
పెద వేంకటేంద్ర హంవీర
నను కరుణ జూచుటకు వేళర.
ఇది వేళర, చల మేలర, మది బూనర
నీ దానర నన్నేల - దానరాధేయ
రాజా బహద్దర్ శభాసు సలాం
తళాంగ్ తక దిమి
తక తది గిణ తోం.

ఇవి గాక రెండు వందల వరకూ నా వద్ద శబ్దా లున్నవి. అవి వేరొక పుస్తకంలో ముద్రించగలము.

## మీరు చదవ వలసిన పది చిన్న పుస్తకాలు

1. ఆంధ్ర నాట్యం — ఆలయాలు
2. ఆంధ్ర నాట్యం — నాట్య శాస్త్రాలు
3. ఆంధ్ర నాట్యం — ఆలయ నృత్యాలు
4. ఆంధ్ర నాట్యం — ఆస్థాన నర్తనాలు
5 ఆంధ్ర నాట్యం — అమర నర్తకులు
6. ఆంధ్ర నాట్యం — అభినయం
7. ఆంధ్ర నాట్యం — కూచిపూడి నాట్యం
8. ఆంధ్ర నాట్యం — పేరిణి - నవజనార్దనం
9. ఆంధ్ర నాట్యం — ప్రజా నర్తనాలు
10. ఆంధ్ర నాట్యం — జానపద - గిరిజన నృత్యాలు
11. ఆంధ్ర నాట్యం — భరత నాట్యం

ప్రచురణ : పేరిణీ ఇంటర్ నేషనల్

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-500 001

ఒక్కొక్కటి : రూ॥ 5 -

రానున్న గ్రంథాలు
ఆంధ్ర నాట్యం – పరిశోధన - పరిచయం
భరత శాస్త్రం – ప్రశ్నలు - సమాధానాలు

నృత్యకళాకారులందరూ చదవవలసిన

# డాక్టర్ నటరాజ రామకృష్ణగారి

అత్యంత అద్భుత గ్రంథం

# దాక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర

నృత్యకళ పైని తెలుగులో ఇటువంటి గ్రంథం వేరొకటి ఇంతవరకు వెలువడలేదు

తెలుగు, తమిళ కన్నడ, మళయాళ భాష లన్నింటిలో అత్యుత్తమ గ్రంథంగా ఉమ్మడి మదరాసు రాష్ట్ర ప్రభుత్వ బహుమతిని 1952 లో పొందిన గ్రంథం, ఆనాటి రాష్ట్రపతి స్వర్గీయ బాబూ రాజేంద్ర ప్రసాద్‌గారు ఈ బహుమతిని డా॥ రామకృష్ణగారికి ప్రదానం చేశారు. భారతీయ నృత్యకళకు సంబంధించిన ప్రతి చిన్న విషయంగూడా ఇందులో ఉంది. సుమారు ఇరవై సంవత్సరాల ప్రాయంలోనే శాస్త్రీయ, ఆలయ, ఆస్థాన ప్రజా, జానపద, గిరిజన నర్తనాల గురించి డాక్టర్ నటరాజ రామకృష్ణ ఇందులో వివరించారు. నృత్య వాయిద్యాల గురించి, నృత్య సంగీత రచనల గురించి ఇందులో చర్చించారు. డా॥ నటరాజ రామకృష్ణగారికి తప్ప ఇతరులెవ్వరికీ ఇలాంటి గ్రంథం వ్రాయడం సాధ్యంకాదు. మీరు తప్పక చదవండి.

ప్రచురణ : పేరిణీ ఇంటర్ నేషనల్

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-500 001.

వెల : రూ॥ 60 -

మీరు చదవదగిన అపూర్వ గ్రంథం

# పేరిణి శివతాండవం

వేయి సంవత్సరాలకు పూర్వం మన తెలుగు నాట్యశాస్త్రవేత్తలు రూపొం దించిన ఆంధ్రులకు గర్వకారణమైన ఏకైక వీరనాట్యం పేరిణి. శివుని ఆరాధించే విశిష్ట తాండవనర్తనం ఇది. వీర రస ప్రధానమైనది ఈ పేరిణి నాట్యం.

భారతీయ నృత్యకళకు ఆంధ్రులు సమర్పించిన అపూర్వ పూజా పుష్పం ఈ పేరిణి.

పురుషునిలోని పౌరుషాన్ని, వీరునిలోని వీరత్వాన్ని, మగవానిలో మగ టిమిని లోకానికి చాటిచెప్పే పురుషుల నాట్యం ఈ పేరిణి.

కాకతీయ గణపతిదేవ, వీర రుద్రమ, ప్రతాప రుద్రుల కాలంలో విశిష్ట ఆదరణ పొందిన నాట్యం పేరిణి. కాకతి సైన్యాలు కదనరంగానికి వెళ్లిన సమయాలలో వీరులు, మైలారదేవులు, మహేశులు, పశుపతులు ప్రేరణగా ప్రదర్శించిన నర్తనం ఈ పేరిణి

కాకతీయ గజసేనాపతి, గణపతిదేవ బావమరిది నాట్యాచార్యా కొండయా మాత్యుని శిష్యుడూ అయిన జాయప రచించిన నృత్తరత్నావళిలో ఈ నర్తనం గురించి వివరంగా ఉంది. కాకతీయుల తర్వాత ఈ నర్తనం మరుగున పడి పోయింది. కాలవాహినిలో మరుగుపడియుండిని ఈ నాట్య రీతిని ఏడు వందల సంవత్సరాల తర్వాత భరతకళాప్రపూర్ణ డాక్టర్ నటరాజ రామకృష్ణ గారు రామప్ప దేవాలయంలోని శిల్ప సంపద, నృత్తరత్నావళి, శైవాగమముల ఆధారంతో పునః ప్రతిష్ఠ చేసి, ప్రచారంలోకి తీసికొచ్చారు. నేడు ఈ పేరిణి తెలుగు వీరుల వీరనాట్యంగా మరల వెలుగొందుతున్నది.

ప్రచురణ
పేరిణి ఇంటర్ నేషనల్
అశోక్‌నగర్, హైదరాబాదు-20

ప్రతులకు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు-1

# మీరు చదవ వలసిన పుస్తకం

డా॥ నటరాజ రామకృష్ణ గారి

# రుద్రగణిక

ఆచార్య తూమాటి దోణప్ప, తెలుగు విశ్వవిద్యాలయం కులపతి గారి అమూల్య అభిప్రాయం నుండి ముచ్చటైనా మూడు ముచ్చటలు.

"రుద్రగణిక" ఎంత చక్కటి పేరు ! రుద్ర గణిక శబ్దాలు వేరు వేరుగా లోకంలోనూ, సాహిత్య లోకంలోనూ, ప్రచుర ప్రచారంలో ఉన్నవే కాని, ఈ రెండింటి కలయికా ఒక అద్భుత సన్నివేశం. ఒక అపురూప సమాసం. రుద్ర ప్రీతికరమగు నృత్య కళారాధనకు అంకితమైన గణిక అన్న అర్థంలో ఈ సమాస కల్పన శిల్పితమైనట్లు ఊహించవచ్చు. వేదవాఙ్మయంలోనూ, (త్ర్యంబకం యజామహే) అనంతర దేశభాషా వాఙ్మయాలలోనూ కన్పించే రుద్రుడు శత్రుజన సూరనుడైననూ భక్త జన సులభుడు. అభినయకళకు ఆదిమ పీఠం".

"ప్రస్తుత గ్రంథ రచయిత భరతకళా ప్రపూర్ణ డాక్టరు నటరాజ రామకృష్ణ గారు కళారాధకుడుగా, కళాసాధకుడుగా, కళాబోధకుడుగా, కళావిమర్శకుడుగా పేరుపొందినవారు. మానవునిలో మాధవునీ, మహదేవునీ చూడగలిగిన మహిత సంస్కారం శ్రీ నటరాజ రామకృష్ణగారిది. శ్రీమాన్, ధీమాన్, వివేకీ, వితరణ నిపుణోగాన విద్యా నిపుణః... కలావాన్ అభినయ చతురః....అని పెద్దలు పేర్కొన్న ఈ అన్ని సుగుణాలూ రాసి పోసిన కళామూర్తి ఆయన".

"ఆదరణ కరువై, ఆచరణ బరువై కొనఊపిరితో కొట్టు మిట్టాడుతున్న నృత్యకళా రూపాల భవితవ్యం పట్ల ఒక కళాకారునిలో జనించే ఆవేదనమూ, వ్యక్తి ధర్మానికి, వ్యవస్థా ధర్మానికి మధ్య రేకెత్తిన సంఘర్షణలో బతుకు పొద్దు వాటారిన కళాకారుల దయనీయ చరితలను ఆవిష్కరించేపట్ల ఒక మానవతావాది హృదయ కుహరంలో పెల్లుబికే ఆక్రోశమూ ఇందులో అడుగడుగునా గోచరిస్తాయి. సహృదయాలు ఈ మూగవేదననూ, అక్షరరూప నివేదననూ సనిగా అర్థం చేసుకోగలిగితే రచయిత ధన్యుడు.

వెల : రూ॥ **20** - ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్

# ఆంధ్ర ప్రదేశ్‌లోని 'ఆంధ్ర నాట్యం' పాఠశాలలు

1. నటరాజ నృత్యనికేతనం, విశాఖపట్నం
2. నటరాజ నృత్యనికేతనం, నరసీపట్నం
3. నటరాజ నృత్యనికేతనం, కాకినాడ
4. నటరాజ నృత్యనికేతనం, పిఠాపురం
5. శ్రీ నటరాజ నృత్యనికేతనం, రాజమండ్రి
6. ఆంధ్రనాట్య పీఠం విజయవాడ
7. శ్రీ గిరిజా నృత్యనికేతనం, తెనాలి
8. నటరాజ నృత్యనికేతనం, గుంటూరు
9. నటరాజ నృత్యనికేతనం, టంగుటూరు
10. నటరాజ నృత్య నికేతనం, బిట్రగుంట
11. నటరాజ నృత్యనికేతనం, కర్నూలు
12. నటరాజ నృత్యనికేతనం, ద్రోణాచలం
13. నటరాజ రామకృష్ణ నృత్యనికేతనం, గద్వాల
14. నృత్యనికేతనం, హైదరాబాదు
15. నృత్యాంజలి, హైదరాబాదు
16. నటరాజనికేతన్, హైదరాబాదు
17. పేరిణీ ఆర్ట్స్ అకాడమి హైదరాబాదు
18. నటరాజ నృత్య నికేతనం, సంగారెడ్డి
19. శ్రీ నటరాజ రామకృష్ణ నృత్య నికేతనం, సిద్ధిపేట
20. నటరాజ నృత్య నికేతనం, సిరిసిల్ల
21. కళా భారతి, నిజామాబాదు
22. కళా భారతి, బోదన్
23. కళా భారతి, కిసాన్‌నగర్
24. కళా భారతి, ఆర్మూర్
25. శ్రీ రాజరాజేశ్వరీ నృత్య నికేతనం, వేములవాడ
26. ఊర్వశీ కళా స్రవంతి, కరీంనగర్
27. నటరాజ నృత్య నికేతనం, గోదావరిఖని
28. కోలమ్ స్కూలు, ఉట్నూరు, తాండూరు
29. పేరిణీ ఇంటర్ నేషనల్, హైదరాబాదు



డా॥ నటరాజ రామకృష్ణ

# పరిచయం

ఆంధ్ర దేశంలోని ఆలయాలలో, ఆరామాలలో, రాజాస్థానాలలో సుందరాంగులైన స్త్రీ నర్తకులు గత రెండు వేల సంవత్సరాలుగా ప్రదర్శిస్తూ వచ్చిన కుసుమ కోమలమైన లాస్యనర్తనమే ఆంధ్ర నాట్యం.

డాక్టర్ నటరాజ రామకృష్ణ ముప్పయి యయిదు సంవత్సరాల క్రితం ఆంధ్ర దేశంలో అడుగు పెట్టినప్పుడు శాస్త్రీయ నృత్యం ఆంధ్ర దేశంలో లేదని కొందరు పెద్దలు ఆయనకు చెప్పారు. అందువల్ల ఆయన ఆంధ్ర దేశమంతా పర్యటించి, అనేక మంది వృద్ధ కళాకారులను కలుసుకొని ఎన్నో దేవాలయాలను సందర్శించి, అనేక గ్రంథాలను పరిశోధించి విశిష్టమైన ఆంధ్రుల నాట్యకళా చరిత్రను వెలికి తీశారు. అనేక గ్రంథాలను రచించారు. ఆంధ్రుల శాస్త్రీయ నృత్యాన్నే ఆయన 'ఆంధ్రనాట్య' మన్నారు.

నర్తకులుగా, నాట్య కళావేత్తగా, నాట్యకళా చరిత్ర పరిశోధకులుగా, నాట్యకళా ప్రచారకులుగా, నాట్యాచార్యులుగా, నాట్యకళా ప్రబోధకులుగా, రచయితగా ఆయన్ని ఎరగని ఆంధ్రుడు లేడు.

ఇంతవరకు రెండు వేల మందికి పైగా బాలబాలికలకు ఆంధ్రనాట్యం నేర్పి, వారిని తీర్చి దిద్దారు. సుమారు ఏభై గ్రంథాలను ఆంధ్ర నాట్యం పైని, వ్రాశారు.

ఆంధ్రనాట్యం ఎంత మహోన్నతమైందో ఈ పది పరిచయ పుస్తకాలను చదివి తెలుసుకొనండి.

గిడుగు రామమూర్తి

ముద్రణ: గ్లోరియస్ ప్రింటర్స్-హైదరాబాదు-16 వెల: రూ॥ 5-

